# కృతిగ్రహీత.



కీ॥ శే॥ మల్లాది దక్షిణామూర్తి శాస్త్రిగారు.

# విజ్ఞప్తి

"కోహినూరు వజ్రముతో నొక
కోమల భావమునెన్న మిన్నయౌ
ఉన్నత భావోపేత రసాన్విత
కావ్యమ్మునకిల సాటి కల్గునే !"

బుద్ధికి పదును, హృదయమునకు సంస్కారము కలిగించి ఇహపర సమన్వయమును నొదవించు జ్ఞాన విజ్ఞాన సమన్వయ కరములగు రచనలతో సరస్వతీ పూజ సల్పుట మా విజయ సాహితి పరమ లక్ష్యము.

నవల, నాటకము, కథానిక, గేయము, కావ్యము మున్నగు సకల సాహితీతరుశాఖల విస్తరణమున నాంధ్రావని యుల్లము పల్లవించు చల్లదనమును సమకూర్చుట మా ఆశయము.

ఉడుతాభక్తిని మాచేయు కృషికి సహకరించి తగు ప్రోత్సాహము నొసంగవలసినదని ఆంధ్రమహాజనుల నభ్యర్థించుచున్నాము.

మా విజయసాహితి వినయవినమితయై సమర్పించు తొలి కానుక ఈ మధువీచి.

మా ప్రచురణలకు అక్షర రూప పరబ్రహ్మమును చిహ్నముగా నిర్ణయించి చిత్రించిన సహృదయులు, చిత్రకళావిదులు మిత్రులునగు శ్రీ అంట్యాల పైడిరాజుగారికి మా ధన్యవాదములు.

విజయవాడ
కార్తిక పూర్ణిమ
౧౭–౧౧–౫౬

మల్లాది కృష్ణప్రసాద్
సంపాదకుడు
విజయసాహితి.

# మధువీచి

హృదయమెయౌ నొక
క్షీరసాగరము
దేవాసురులు
మనః ప్రవృత్తులౌ
మథనమ్మున
కవ్వము లోకస్థితి
పరిశీలన
నాశయె పాశమ్ముగు.

ఆరాటము
పోరాటము త్రిప్పుచు
హాలాహలోద్భ
వమ్మౌ ధ్రువముగ
అతినిగ్రహమ్ము
దానిగ్రసింపగ
అమృతోత్పాదన
మౌనాపిమ్మట.

అమృతనావ
సంసేవనమున నరు
డారోహితుడౌ
నమృతత్వమునకు
పునరావృత్తి
రహితమౌ పదమును
పొందునమందా
నంచ మనయమును.

దుర్ముఖి
కార్తిక పౌర్ణమి

రామచంద్రశాస్త్రి

# విషయసూచిక


| | పుట |
|---|---|
| ఆహ్వానము .... .... | 1 |
| కర్తవ్యము .... .... | 4 |
| కల్యాణ కాంక్ష .... .... | 5 |
| సాగిపోదము .... .... | 7 |
| ఆశాభానూదయము .... .... | 8 |
| మధూదయము ... ... | 9 |
| ఆనందో బ్రహ్మ .... .... | 11 |
| ఏమారీ ! .... .... | 14 |
| పరితోషము .... .... | 16 |
| ఓ మాతృదేవీ ! .... .... | 18 |
| దక్షారామసందర్శనము .... .... | 20 |
| ముక్కోటి .... .... | 21 |
| ఉగాది ... ... ... | 23 |
| తృప్తి ... .... .... | 26 |
| బొంగరములు ... ... | 28 |
| అల్లిబిల్లి .... .... .... | 29 |
| విచిత్రయానము .... .... | 31 |
| అంతఃకరణము .... .... | 37 |
| ముక్తినిమ్ము .... .... | 39 |
| ఆయవ్యయములు .... .... | 42 |
| ఆగమనము .... .... | 44 |
| సత్యము .... .... .... | 46 |
| అనంతమౌనా ? ... ... | 47 |

ఏదోయేమో ? .... .... 49
నా ప్రభూ ! .... .... 51
మహాద్భుతము .... .... 53
ఆత్మదర్శనము .... .... 54
సార్థకము .... .... .... 56
నా..ంబంధము .... .... 58
హెచ్చరిక .... .... .... 60
ఎన్నటికో ! .... .... .... 62
మనోహరుడు .... .... 64
శారదా ! .... .... .... 69
ఆలంబనము .... .... 70
ముందో—వెనుకో .... .... 72
విందు .... .... .... 74
హితవు .... .... .... 75
ఇకేది ? .... .... .... 76
ఓరసాలమా ! .... .... 77
పార్థిస .... .... .... 78
ప్రబోధము .... .... .... 80
విశ్వాసము .... .... .... 83
ఓ పిపీలికా ! .... .... 84
హెచ్చరిక .... .... .... 85
సహజీవన సిద్ధాంతము .... .... 90
నన్నయ .... .... .... 95
తిక్కన .... .... .... 98
ఎఱ్ఱాప్రెగ్గడ .... .... 103

| | | | |
|---|---|---|---|
| పోతన .... | .... | .... | 10[illegible] |
| తిరుపతి వేంకటేశ్వరులు | .... | .... | 110 |
| కవిసమ్రాట్టు | .... | .... | 113 |
| విశ్వకవి .... | .... | .... | 119 |
| మహాత్ముడు | .... | .... | 123 |
| అరవిందుడు | .... | .... | 127 |
| జగదీశచంద్రుడు | .... | .... | 130 |


---

# మ ధు వీ చి.



## ఆ హ్వా న ము.

ఇటురండు
ఇటురండు
పటుతరా
నేక భా
వాన్వితా
వేశయుత
మతులార !
హితులార ! ....

పటు క్రోధ
ములుప్రబలి
చటులోగ్ర
తలు రవిలి
స్ఫుటతగాం
చకబ్రతుకు
కట కటల
పాలయ్యె.



అపశ్రుతుల
సరిజేసి
శ్రుతిహితము
కూర్పగా
అపకృతుల
బాపి జగ
దుపకృతి
నొనర్పగా.

హృదయ
మార్ద్రమొనర్చ,
మృదుమధుర
భావముల
ప్రధితయశ
మొనగూర్చు
క థ న
మాధుర్యములఁ

అవనియో
నొక నికే
తన మంచు
చాటగా

## ఆ హ్వా న ము

అవని నే

నై క నే

తనము వెం

యుంపగా.

వ్యక్తి వికా

సనము వి

శ్వ శ్రే్యయ

మొనగూర్చు

నిశ్శ్రేయస

పథమ్ము

నిజ ధర్మ

మున జూప.



# కర్తవ్యము

చెరిపి వేయుద మింక
గీతలు
మరచి పోవుదము విధి
వ్రాతలు-

అవిగిరులె యౌగాక
అర్ణవము లౌగాక
ఆకాశగమనమ్మె
నడ్డుకొనలేవెపుడు-

ఆత్మ బాంధవులుగా
అవని జనులొండొరులు
ఆపదల కాదుకొని
ఏపునందగనదను-

నిజస్వత్వముల నరయు
నిజతత్వముల దెలియు
విశ్వప్రియపు పథమ్మె
విశ్వశాంతికరమ్మౌ.

# కల్యాణకాంక్ష

సమదృష్టిని
వీక్షించేము

సమాదరణ
చూపించేము

సమస్త
ప్రాణుల
నొకే రీతిగా
సంభావించేము.

హృదయమ్మొక
అమృత ఝురిగా
మదినిండిన
తేనె వాకగా
సుధాప్లావితము
లౌ వచనమ్ముల
సకల గతి
నలరించేము.

అమానమౌ
విజ్ఞానముతో
అనన్యమౌ
నుత్సాహముతో
అనుపమమౌ
ననురాగముతో
అఖిల విశ్వమును
సేవించేము,

అవరోధమ్ముల
నతిక్రమించి
అవిరోధమ్ముల
నైక్యమొనర్చి
అమరపథమ్ముల
నన్వేషించి
విమల చంద్రికల
విహరించేము.

## సా గి పో ద ము

సాగిపోదము సఖా!
సహచచరులమై మనము
చారుచర్చా చమ
త్కారముల నికముందు.

వేదనల విడనాడి
వాదనల కడద్రోలి
భేద భావము వీడి
మోదవార్నిధిదేల.

సరస సాహిత్య సుమ
సౌరభమ్ముల దనియ
సహజ సౌందర్య విల
సిత ప్రకృతి వీక్షింప.

విమల విజ్ఞాన చం
ద్రికను విహరించ లప్పి
కమల భవువాగమృత
కావ్యరసముంగ్రోల.

విజయ ఘోషల తోడ
విజిగీష యొప్పార
విశ్వకల్యాణ ఘం
టా నినద మొనరింప.

## ఆ శా భా నూ ద య ము

ఆశాభానూ
దయ మయ్యెన్ హృది
శోక తిమిర సం
చారమడంగన్.

మానస హ్రదమున
భావ జలజములు
ప్రమోద పూర్ణము
లై హసియింపన్.

సుగంధ బంధుర
సుమ రజమును గొని
సారెకుజన నా
వేశ పవనుడు.

చిరశాంతిని సురు
చిర సౌఖ్యమ్మును
సమకూర్చును నా
ఆశాభానుడె.

*
**

# మ ధూ ద యు ము

మధూదయం

మధూదయం

మధూదయం

ఉగాది సమయం.

అగాధకాల

మహోద్ధి జనించే

ప్రగాఢరుచి రో

దయ వీచికలన్

నిగూఢమౌ త

త్త్వము జగమ్మునకు

నిరూఢి చేయగ

వచ్చిన సమయం.

అనాగత మ్మా

గతమౌ నిత్యము

ఆగతమ్మౌ గత

మౌ నిది సత్యము

ఏగతమ్మౌ గణు

తింపక నిత్య మ

నాగతమ్మునకు

స్వాగత మిచ్చే.

కొదమకోయిలలు
కొసరి కొసరి తమ
పాటల వీనుల
విందొన రించెను.
మధుపఝుంకృతులు
మరి మరి యాచు మ
నమ్మన నాహ్లో
దమ్మను పెంచెను.

తరణి కిరణ రా
గోజ్జ్వలతన్ గొని
తరులతాదు లల
రం గొ్రన్ననలన్
మధుమాసోత్సవ
మయ్యె వసంతుని
మన్ననకై యె
త్తిన హారతిగా.

# ఆనందో బ్రహ్మ

కలువ చెలువ

మును గాంచును

చలువ తేవి

గనినంతనె

సరసిజ మల

రును మిత్రుని

కరస్పర్శ

గాంచగనే.

తారక లను

గాంచినంత

మీరును హృది

నానందము

కోరిక లె

న్నెన్నో మది

చేరికలై

ముద మొసగును.

పరస్పరా క
　　ర్షణ సంబద్ధం
ప్రపంచమంతా
　　ప్రేమ బద్ధం
పరస్పరాలో
　　కనమున లోకం
ప్రమోదాత్మకం
　　ప్రసన్నాత్మకం.

సుముద మానసము
　　సుందర వదనము
సమ్మోదాత్మక
　　ములు విశ్వమ్మున
విశ్వైశ్వర్యము
　　సంభావింపగ
విశ్వ జీవతతి
　　యానందమయో.

## ఆ నం దో బ్ర హ్మ

ఆనందమె సౌం

దర్య నిధానము

ఆనందమె సౌ

భాగ్య ధామము

ఆనందమె సుర

చిర చిర సత్య

మ్మానందమెయో

నరయగ బ్రహ్మము.



# కు మా రీ

ఓ

చిరతపః ఫలిత

లలిత ప్రసూనమా !

చిరమనోరథతృప్త

దరహాస చంద్రికా !

చిరతరాదర్శనవ

సుమనోజ్ఞ వల్లికా !

చిరకాల దర్శనా

లస వయన సుఖకరీ !

విజయోస్తు ! తే

కుమారీ !

సర్వదా

విజయోస్తు ! తే

కుమారీ !

సుధాసేవనాతృప్త
మధుకర ప్రియ ముఖాం
బుజ; వీక్షణానంత
బుధజనానందకరి !
దరహాసిత వదనేందు
పరిహాసిత, సిత సింధు
అహారీ ! సురమ్యా
రూపే ! విజయోస్తు !
విజయోస్తు ! తే
కుమారీ !
సర్వధా
విజయోస్తు ! తే
కుమారీ !



## ప రి తో ష ము

పరితోష మొదవె
హృది నీనాడే
చరితార్థ మయ్యె
జవి యీనాడే.

పరికల్పితానేక
తరులతా గుల్మసుమ
కలితోరు జలధరా
కలిత నీహారాంబు
కణ శీత మృదుపవన
జనిత చలితోల్లాస
నవ విలస నానంద
నవ్య ప్రకృతిగనగ.

భయద జీమూత పరి
వార వేష్టిత శిఖర
వినిపాత నిరత జల
ధారా ఒ జగరదృశ్య
దర్శనోద్భవ సులలి
తాకులిత భావ సం
స్పృహనీయ మహనీయ
భూధరమ్ముల గనగ
పరితోష మొదవె
హృది నీనాడే
చరితార్థ మయ్యె
జని యీనాడే.



# ఓ మాతృదేవీ!

చిర సురుచిర మం
దహాస విలసిత
వర కరుణాంచిత
వాగమృత ఝరీ!
సుమపేశల మా
నస సందీపిత
సమదృక్సారణి
సర్వబంధుప్రియ!
అమల గుణమణిఖనీ!
విమల తర భాషణీ!
ఓ మాతృదేవీ!
చరితార్థ జీవీ!

సంతోషిత భా

విత నిజభావన !

అంతరంగ ని

ర్జి తారి షడ్గణ !

అంతః కరణా

మోద స్వీయ గృ

హాంతరాను వ

ర్తిత కార్యక్రమ !

అమలగుణమణిఖనీ !

విమలతర భాషణీ !

ఓ మాతృదేవీ !

చరితార్థ జీవీ !





# దక్షారామ సందర్శనము

ఈ లోకమునె
మరచినాను
నీ యాలోకనమున
నా కేలోకమో తోచి.

కదళీ తతిని జూచి
కాసార మీక్షించి
ఘన గోపురము లెంచి
కాంచి వప్రమ్ములను.

ఘటనాఘటను దివ్య
నటనా విశేషచణు
నిటలాక్షు నర్చించు
నిటకలిమి నూహించి.

ఘనుడు భీమేశనం
దనుడు దక్షారామ
కవి కుంజరుండు శ్రీ
మన నెంచివినుతించి.



# ము క్కో టి

ముక్కోటి

ఈ నా డు

ముక్కోటి—

ముదిత హృదయ

సమున్న

తోత్సాహి

తుల వీటి—

ముక్కోటి దేవతలు

ముద్దు మురిపెములతో

ముస్తాబుగా నేడు

వస్తారు ఈభువికి—

ముదము విరిసిన రీతి
 మదిరూపుగన్నట్లు
పదిలమ్ముగా ముత్య
 ముల వరుసలున్నట్లు
ఇంటింట ముగ్గులే
 జంటతోరణములే
మింటినంటెడు హృద్య
 వాద్య ధ్వనులె నేడు-

ఇందిరాసతి గూడి
 బృందారకులతోడ
వందారు జనుల కా
 నంద ప్రదాతగా
వందిమాగధులు తన
 వెంటరా వీభువికి
బృందావ రక్షుండు
 విందువకువస్తాడు-

---

# ఉ గా ది

ఉగాది వచ్చిం
దుగాది వచ్చిం
దగాధ కాల మ
హాబ్ధి తరంగం.
ఎగాదిగా పరి
కించి క్షణములే
దగాచేసి వ
త్సరమై తరలెన్.

కనిపించే యీ
విశ్వంలో
కనిపించని
దొంకటేయున్నది
క్షణమై దినమై
మాసమ్మై
చనువత్సరముల్
యుగయుగముల్.

ఆదరకు మెపుడో
గడచిన దానికి
బెదరకు మిప్పుడు
వడచే దానికి
పదిలముగా
పూనే పూనిక
ఇది మీకగు
మగాది కానుక.

కడచిన వ
త్సరమున నేయే
కడగండ్లం
బడితివో యవియే
నడచెడు వ
త్సరమున కాయా
ముడుపులు గ
ట్టిన మోదమ్ముల్-

ప్రతి ప్రాణియు
సుఖమే కోరును
ద్రుత గతియై
కాలము మారును
వెతలొందనివ
వీసరి వేసరి
స్మృతి నందక
యుండుటె మగసిరి.



# తృప్తి

నాకింక కావలయు
నే మీ
లోకాన
నే గోరవలయు నిం
కే మీ ?

చిర మందహాస వీ
చికల దూగుదును నే
సురుచి రానంద వా
ర్నిధి గుర్రింకు లిడుదునే
మధుర మంజు రవాప్తి
ముదమందు చుందునే
మహనీయ భావ వి
స్ఫూర్తి పాడుకొనుచుందు ॥

ఇన చంద్ర తారకల
నమరక్తి బిలుతునే
మన మలధ మలయాని
లునితోడ నాడుదును
మహార్ణవములతో
మైత్రినెలకొల్పుదును
మహిమాన్య భూధర
మ్ముల వేడ్కఁగనుచుందు ॥

# తృప్తి

శరదిందు చంద్రికను
        స్వేచ్ఛ విహరింతునే
పరవింప సమ సుంద
        రాస్యమ్ము నరయుదును
సు విశాల విశ్వవిహా
        రణ సల్పనెంతునే
సుమనోజ్ఞ ప్రకృతి కాం
        తను పల్కరింతునే
నాకింక కావలయు
                నే మి ?
        లోకాన
నే కోరవలయు నిం
                కే మి ?



## బొం గ ర ము లు

ఎంత చక్కని
    బొంగరములు !
ఇవి
  ఎంత వింతౌ
    బొంగరములు ?
అంతులేకుండ నిను
    మంత విసుగనకుండ
నింత చక్కగ ద్రిప్పు
    పంతగా డెవడౌనో ! ॥

ఎంత కాలమ్ముగా
  నివి తిరుగుచుండెనో ?
ఎంత కాలమ్ములు
  నివి తిరుగ నుండెనో ?
ఇంతకాలమ్ముగా
  నివి యిట్లె తిరగెనో ?
అంతమౌదాక నిక
  నివి యిట్లె తిరుగునో ? ॥

పంత మెవ్వరితోడ ?
    అంతమెప్పుడు ఆట ?
అంతు కనగల రెవరు ?
    చింతనకు అందునా ? ॥

# అల్లిబిల్లి

అల్లిబిల్లి

తాదిరుగున ?

అవని యిది

నిజమ్మా ?

అనవరత

మ్మవనికి శశి

అనునయ

ప్రదక్షిణమ్మా ?—

ఆసక్తి సహా

స్కారుండు

ఈస్థితి నం

తయు గనునా ?

ఏ సక్తత

దా నెరుగక

నేకస్థితి

యందుండున ?—

చిరతర ధా
　　త్రీ భ్రమణము
రవి విశేష
　　మున నౌనా ?
రవి నెల్ల
　　ప్పుడు చుట్టుట
భువి విశేష
　　మే యౌనా ?—

తిరుగుట నని
　　శమ్మవనినీ
దివారాత్రి
　　ములు కల్గున ?
తిరుగక తిర
　　మగుచో భువి
దివమో రా
　　త్రియొ నిల్చున ?—

# విచిత్రయానము

కదలిక లేని
　　ప్రయాణము
పదిలమైన
　　దీ యానము
చోదకు నొ
　　క్కని గానము
మోదముగను
　　చిరయానము ॥

సాగిన దెపుడో
　　మరియిది
ఆగున దె
　　క్కడనో గాని
వేగమ్ము స
　　సమగతి నిది
సాగెడి నన
　　వరతమ్మును ॥

మజిలీ యొ

క్కటి గానము

"విజీ" లిచ్చెడి

వాడు లేడు

విజనమ్మున

నెల్లప్పుడు

నజేయముగ

జనుయానము ॥

వెలుగుతేడు

కనవచ్చును

చలువల తే

డును వచ్చును

తారక అతి

తరళములై

తోచు నవిర

ళమ్ములుగా ॥

వెలుగు గాంచి

నిలువ కచట

వెలుగు తేని

వదలును ఇది

వదలియు దన

దారి బోక

మరల చుటు

తిరుగును ఇది ॥

వెన్నెల జా

బిల్లి యిచ్చు

వేడి వెలుగు

సూర్యు డిచ్చు

అన్నియు నివి

దీని కొఱక ?

ఎన్నిటి కొఱ

కో యానా? ॥

కదలుచుండె
నని తోచదు
కదలక నిది
క్షణముండదు
వదలజాల
రెవరుగాని
యుదయాస్త
మయమ్ములిందె ॥

రాముడు పయ
నించె నిందు
కృష్ణుడు పయ
నించె నిందు
భీముడు ము
న్నగు నెందరో
భీమ బలులు
పయనించిరి ॥

పయనమ్మన

నను యమ్మను

పలుమారులు

వచ్చినవే

కన నయ్యేడి

విననయ్యేడి

పసరాదొకటి

వినూత్నము ॥

సకల జీవ

సందోహము

వికసనమున

పయనించును

వికల్పమును

పొందునిందె

విచిత్రమిది

యూహింపగ ॥

ఇట్టివి యిం
కెన్నెన్నో !
ఎంతలేసి
గా నున్నవో !
వింతగ గూ
ర్చిన దెవరో !
అంతెవ్వరు
గనజాలరు ॥



## అంతఃకరణము

అణుచలన

ప్రభావ జనితమా ?

ఐనా నీ

ధ్వని ప్రవాహము

ధ్వని జనిత

ప్రభావ ఫలితము

అణు సముదయ

ప్రసారభరితమా ?—

అణుసంశ్లేషణ

మనసా? మోదం

అణువిశ్లేషణ

మనసా? ఖేదం

అణుసంచలన

మ్మనసా? క్రోధం

అణుసముద్భవ

మ్మగునా? భేదం—

అణువౌనా?

అన్నిట నతిసూక్ష్మం?

అణువు కన్న

కలదా? మరిసూక్ష్మం

అణువునకే

యాకర్షణ మున్నద?

అణువును

ఆకర్షించున దున్నద?—

ఆనందం

అణుసంజనితమ్మా?

ఈ హృదయం

ఒక నందనమౌనా?

అణూద్భవమ్మా?

అంతఃకరణం

అపార్థినమ్మా?

అంతఃకరణం?—

# ముక్తి నిమ్మ

శక్తి నిమ్మ
యుక్తి నిమ్మ
రక్తి నొసగి
భక్తి నిమ్మ—

అత్యుష్ణము
గాకుండా
అతి శీతము
గాకుండా
రక్త నాళ
ములలో నా
రక్తము ప్రవ
హింప జేయ—

గతమునకై

వగవక యా

గతమునకై

బెదర కఽనా

గతమునకై

యదరక, నా

మది పదిల

మ్మున నుంపగ—

శుభ చింతన

మది నింపగ

శుభ దృష్టిని

జగమరయగ

శుభము సకల

మున కొసగగ

శుభమె సకల

మునగనగా—

# ముక్తి నిమ్ము

నాలో సక

లమ్మును గన

సకలమ్మున

నన్గనుగొన

నిఖిలలోక

సంరక్షక

నిరుపమ స

త్యమ్మును గన

శక్తి నిమ్ము

యుక్తి నిమ్ము

భక్తి నొసగి

ముక్తి నిమ్ము.



# ఆ య వ్య య ము లు

అంకణాతీయు మోయి
　　జీ వి త ము
అంచనా వేయుమోయి ॥

ఉపకార మొనరింప
　　నూర్జితమ్మదియౌను
అపకారమును సల్ప
　　విపరీత వ్యయమౌను ॥

మదిముదమ్మున నుంప
　　నది ఆయముగ వచ్చు
ఎద దుఃఖమున నింప
　　నది వ్యయమ్మున హెచ్చు ॥

ఇతరులకు నై వెతలు
　　మితిలేని యార్జనము
ఇతరులకు వెతలనిడ
　　నతిదారుణవ్యయము ॥

విజ్ఞానివౌ నీవు
అజ్ఞాన మెడలించు
ఉద్యోగమును బూని
విద్యుక్త మునుసల్పు ॥

ఆయ వ్యయమ్ములను
అపుడె తేల్చకుమోయి
ఆయమ్ము పెంప నీ
కవధియెంతో యున్న
దంకణాతీయుమోయి
జీవితము
అంచనావేయుమోయి ॥



# ఆ గ మ న ము

నానాథు దేతెంచు
నే వేళా
నవ వసంతో దయ
-మ్మావేళా ॥

ప్రణయ భావోద్వేగ
సముద మానసమునను
కరుణా ప్రపూర్ణమౌ
గంభీర హృదయమున
కమనీయభూషణాం-
-చిత మోహనాకృతిని
విమల తర పరిహాస
దరహాస చంద్రికను ॥

సమ్మోదమును పెంచు
సత్ప్రంచ మౌళితో
సరసతను వెలయించు
ముంగురుల సొంపుతో
ప్రేమవార్నిధి ముంచు
ప్రియభాషణములతో
కలవరమ్ము లడంచి
కలరవమ్ముల నించు ॥

విశ్వమోహన కళా
-వేత్ర నేత్రములతో
కస్తూరి తిలక సం-
-కలిత ఫాలమ్ముతో
సుధలీను చలితాధ-
-రమున వేణువునూది
మధుర మంజుల మహిత
మృదుల గానమునల్పు ॥

★ ★ ★

## స త్య ము

పంతమునను పర
మార్థ మరయలే
మాంతరావలో
కనమున గాని.

మంత సహనమే
యెరుగని వారిసు
మంత యైన స
త్యము కనజాలరు.

అంతర్వాహిని
నరయని వారలు
వింతగ పైపై
మెరుగుల జూతురు.

అంతరంగమును
బుధు లెరుంగుదురు
ఆంతత్వము గన
జాలు వారగుట.

# అనంతమౌనా ?

నా కన్నులె

సర్వమును చూచునా ?

నా కన్నుల

పరమా చూడనగునా ?

నా వీనులె

వినునా యీసర్వము ?

నా వీనులతో

విను మానసమా ?

నా నాసిక

పరిమళముఁ దెలియునా ?

నా నాసిక

పరిమళముఁ దెల్పునా ?

నా జిహ్వయె తా

రుచి నెఱుంగునా ?

నా మనసుకు

రుచి నెఱుకజేయునా ?

నా మనసౌనా ?

స్వ ప్రభావితం ?

నా మన సన్యా

ప్రభావితమ్మా ?

అన్యమెయౌచో

నది సాంతమ్మా ?

అన్యమ్మౌనది

అనంతమౌనా ?—



# ఏ దో యేం వెూ

పరుగులిడు నొకసారి
పారాడు నొకసారి
భావమదియేలనొ-పర-
-భావమ్మదేమో ॥

పరిసరమ్ముల నొకట
పరితోష మొదవునెద
పరిసతము లింకొకట
పరిశీలనకె రావు
భావ బలమౌనో-ప్ర-
-భావ బలమౌనో ॥

నాతోసతము పోరి
నా సమున్నతి గోరు
నాహృదిని తొజేరి
నాశ్రేయమును గూర్చు-
-నే శక్తియౌనొ దా-
-నాసక్తి తనకేమో ॥

ఈ జగతిని
నా కొరెంత
ఇరవే లే-
-దని పల్కు-ను
ఈ విశాల
విశ్వమంత
నా విహార
మున కే యను
మాయా నినదమ్మెదో
మరి యాత్మ నినాదమేదో ॥



## నా ప్రభూ!

పరుగులిడు నా
మానసమ్మును
పదిల పరచుము
నా ప్రభూ!
పదిలమొనరిచి నీ
పదమ్ముల
పాదు గొల్పుము
ఓ ప్రభూ! ॥

భయద జీమూ-
-తముల వేగమె
పారద్రోలుము
నా ప్రభూ!
అభయ దాతవు
మిత్రుడవు నయి
ఆదరింపుము
ఓ ప్రభూ! ॥

దురిత దావా-
-నలము నుండి
దరికి జేర్పుము
నా ప్రభూ !
దుస్సహమ్మగు
వేదనల వే
తొలగజేయుము
ఓ ప్రభూ ! ॥

అమలినములో
భావముల నా-
-కమరజేయుము
నా ప్రభూ !
విమలమౌ వి-
-జ్ఞాన చంద్రిక
వెలయజేయుము
ఓ ప్రభూ ! ॥

*
**

# మ హా ద్భు త ము

ఉన్నదనుకున్న దొక-
-టుంటే మహాద్భుతము
కన్నాకుగా జగతి
తిన్నగా దానదము ॥

కన్నులకు కనరాక
ఎన్న శక్యము గాక
అన్నిటను తానుగా
అన్నితనలోనుగా ॥

అన్నిటికి సమమగుచు
అన్నిసమముగ గనుచు
ఎన్నడేని యొకింత
హెచ్చు తగ్గులులేక ॥

అణుకణమ్మున కన్న-
-నతి సూక్ష్మమగుచుదా-
నఖిల విశ్వమ్మునకు-
-నవతరణహేతువై ॥

# ఆ త్మ ద ర్శ న ము

గాలిలో మేడలను
కట్ట తలపెట్టకోయ్
గగన కుసుమమ్ములను
కోయ యత్నింపకోయ్
వినువీధి దిరుగాడ
వెతలందబోకోయ్
వెనుదిరిగి సుంత విచా-
-రముగ యోచింపవోయ్ ॥

ఇహముపీడిన పరము
నందుకొన లేవోయ్
నేల వీడిన సాము
నెందుగనబోవోయ్
ఇహ పరమ్ములు రెండు
ఇచటనే కలవోయ్
ఎదనూహ సేయ నట-
-నున మేలుకొనవోయ్॥

పాతగాధల ద్రవ్వ

పాటు పడబోకోయ్

జాతి మత భేదముల

ఊసెత్తరాకోయ్

ఏకత్వముననే య-

-నేకత్వమున్నదోయ్

ఐక్యమును కనుగొనుచె

ఆత్మ దర్శించుటోయ్ ॥



## సార్థకము

పామరతను విడనాడి
　　ప్రమోదము గనవోయ్
సోమరివై యుంటలో
　　శ్రేయములేదోయ్ ॥

పాటొనర్చ్చుటెంతయు
　　పరితోష హేతువోయ్
పాటు సల్పకుండిన కడు
　　చేటు వచ్చునోయ్ ॥

పాడిపంటలన్ని పరుల
　　పాటు ఫలితమోయ్
పాలు పంచుకొనగ మేలు
　　పాటు సల్పుమోయ్ ॥

మధురమైన భావములను
　　మదిని నింపుమోయ్
మృదుల సంభాషణమున
　　-నెద హరింపుమోయ్॥

శ్రమ యొనర్చుటందున
శక్తి దాచకోంతో
శ్రమకుమించు ఫలిత
సమకూరు తః

ంతో

శషి ॥



॥

లుబిడ్డలతో
అన్నదమ్ములతో
ఆప్తవరులతో
అఖిలజనాళితో
ఆదరమ్ముతో
అనాదరముతో
ఈ శరీరమా–
–త్రమ్మునదేనా?॥

నెలతోయీా వె-

  న్నెలతో చలితో

లలితములో నీ

  లతావళులతో

అలరుగములతో

  నలినహితునితో

ఈ శరీర మా-

  -త్రమమ్మనదేనా? ॥



## హెచ్చరిక

ఆసవీడెదేల? ని,
-రాశ చెందెదేల ?
వీసరవోపునె బ్రతుకు వి-
-కాస మందబోదా? ॥
శిశిరాహత

తరునికరము
కిసలయముల
తనరారదె
శుష్కించిన
జీవనదులు
సలిలపూర్ణ-
-తనుగనవే ॥

మండుటెండ
గాడ్పులు కడు
మెండై మృగ-
-శిర రాగనె
కుండపోత
వర్షమ్ముల
కుంభిని
చల్లనగాదే ॥

# హెచ్చరిక

షోడశకళ-

-లను గోల్పడి

జాడనె గో-

-ల్పోయెడి శశి

పూర్ణకళా

శోభితుడై

పొలుపారడె

పక్షమందె ॥



# ఎన్నటికో

కనుగొను టెన్నటికో
నా ప్రభు
గాంచుటి కెన్నటికో॥

కదన భార్గవుని
మదనమోహనుని
కమనీయవచో
విభవాన్వితుని
కరుణారసభరి-
-తాంతరంగుని
కామితార్థ వర-
దుని నావిభుని ॥

భాసురమౌ తన
తనుపయోదమున
పీతవసనమే
విద్యుల్లతగా
వీతరాగుడై
విబుధజనాళికి
చేతో ముదమొన-
-గూర్చు నావిభుని ॥

నెఱిశిఖిపించ వి-
-నిర్మల రుచి నిజ
నీల పయోధర
నిరవధికద్యుతి
నిరుపమమౌ తన
సరసవచోమృత
సరసి సరసులను
దేల్చునావిభుని ॥

కరకీలిత వేణు
గాన రవమున
కరకంకణ ని-
-క్వణమొదుగంగా
పరమామోద-
-మ్మునుగూర్చుచుమృదు
-పదములనృత్యము
సల్పునావిభుని ॥



# మ నో హ రు డు

ఊరుకొనుమోయి
గోపాలా ! నీవు నీ
దారిజనుమోయి
గో పా లా !
నేరమని తెలియు
గోపాలా ! నేనింక
నాఅడిని సైప
గో పా లా !

* * * * *

నేరమేమియులేదు
గోపీ ! నీకు నే
నేరమిని బాపుదును
గో పీ !
ఊరుకొననింక నే
గోపీ ! నీకు నే
నూఅటను గొల్పుదును
గో పీ !

* * * * *

ఏలనోయి పరి-
-హాసము సల్పగ
చాలునోయి నీ
సరసము లింకను
చాలుచాలు లో-
-కులు జూచిన నిను
చాలగొప్పగను
సంభావింతురు-
ఊరుకొనుమోయి
గో పా లా !

* * * * *

ఉల్లసము మది-
-నెంతొ కలుగగ
నిల్లుపీడిటు
వచ్చితీ విక
కొల్లలుగ సౌ-
-ఖ్యమ్ము నందిన
చల్లగా నిలు
జేరవచ్చును.—
నేరమేమియు లేదు
గో పీ !

వెన్నెలయె తా-
-పమును గొల్పగ
క్రొన్ననలె నను
గ్రుచ్చుకొనగా
తిన్నగా నే-
-నొంటరిని యీ
తెన్నునకు నే-
తెంచి తిపుడే—
ఊరుకొనుమోయి
గో పా లా !

* * * * *

వెన్నెలకు చెలు-
-వమ్ము గూర్చెడు
చిన్నె లెన్నో
నాకు దెలియును
క్రొన్ననలకును
సొబగు హెచ్చును
తిన్నగా నా-
-తోడ రమ్మిక—
నేరమేమియులేదు
గో పీ !

## మ నో హ రు డు

వే ణు గా న
    శ్రవణమున నా
వీనులలరగ
    మేను పొంగగ
మానసమును
    హరించితివి నే
పూనికను గై-
    -కొనగవచ్చితి—
ఊరుకొనుమోయి
    గో పా లా !

* * * * *

వే ణు గా న
    -మ్మేల నిక, నీ
మానసమ్మే
    చాలు నాపై
మానవతివి
    హరింపదానిని
పూని నే
    గానమ్మొనర్చితి—
నేరమేమియు లేదు
    గో పీ !

మదన సాయక
పీడితను న-
-న్నదయతను పై-
కొనగ నగునా ?
సదయుడవు
మదన గోపాలా !
వదలు మింతకు
పుణ్య మొదవును—
ఊరుకొనుమోయి
గో పా లా !

* * * * *

వదల నెంచక
నిన్నుదమినే
నదనునను చే-
-పట్టి తిప్పుడు
ముదమునను విహ-
-రింప రమ్మిటు
మదను రాజ్యము
నేలగలమిక—
నేరమేమియు లేదు
గో పీ !

## శా ర దా !

జయ జయ శ్రీ
శా ర దా !
జయ సుయ శో
విభవాన్విత ॥

జయ జయ వి-
-జ్ఞాన కలిత
లలిత కళా-
-రాధ్య జనని !
జయ విస్తృత
భావోన్నత
సుకవి జన-
-స్తుత్యచరిత ॥

జయ జయ
విద్యాదాయిని !
జయానంద
సంధాయిని !
జయ వాంఛిత
ఫలదాయిని !
జయ జయ జయ
జయ వాణీ ! ॥

---

## ఆలంబనము

ఆత్మీయతను
గొల్పు నేదో
ఆదరమ్మున
నిల్పు నేదో
ఆనంద మొద-
-వించు నేదో
అఖిలమ్ముతోడ ద-
-నైక్య మొనరింపగా ॥

మది నలరజేయు
నది యేదో
ఎద ముదమ్మున
నుంచు నేదో
హృది సుఖమ్మున
నించు నేదో
అదియ యాలంబనము
అఖిల విశ్వమ్మునకు॥

ఇదియె తానను
　　కానని దేదో
ఇదియె తనదను
　　కానని దేదో
ఇదియు తానే
　　యైన దేదో
అదియ యాలంబనము
　　అఖిల విశ్వమ్మునకు ॥



## ముందో—వెనుకో

ఎంతకాల మీ
యిలను గడపినను
అంతమౌదునను
వంతయేలా ?
సొంతము లే దీ
జగతిని సర్వమ-
-నంతమ్మను నిజ
మరయవదేలా ? ॥

ఎన్నెన్నో రూ-
పముల మార్చి నీ
వున్నా విపుడీ
స్థితి నిచ్చట నిం-
కెన్నెన్నో రూ
పముల దాల్చి ముం-
-దుండెద వెచ
-ఔచ్చటనో ॥

ఇహమున నీ జీ-
-వితమును నడుపగ
-నీ శరీర మిపు
-డవసర మయ్యెన్
పరమున నీ విహ
-రణమున కై యెపు
-డే శరీర మవ-
-సర మయ్యెడినో ॥

ఆలుబిడ్డలను
అన్నదమ్ములను
ఐశ్వర్యమ్మును
వీడవగహో ? నీ
ఆప్తు లెందరో
మార్పునందిరిటు
అందరందెదరు
ముందో వెనుకో ॥

---

# విందు

పండు వెన్నెల
విందు నాకు
చందమామయె నాకు
సన్నిహిత బంధువీ ॥

నిండు పున్నమరేయి
పండుగయె నాకెపుడు
దండి సుఖము నొసంగు
నెంతలూ వానలూ ॥

అందగానిలచికై -
-దండలిడు నీ ఘాత
-మండలిని లోకమ్ము
విందు ముదమొనగూర్చు ॥

## హి త వు

ధిక్కరింప
కధఃకరింపక
వెక్కిరింపక
చక్కజేయుము-
నిక్కమైన య-
-నూన భావా
సక్తితో నవ
శక్తి జూపుచు ॥

శక్తి యుక్తుల
రక్తి జేర్చి వి-
రక్తి నెరుగని
భక్తి దీర్చి య-
-సక్తతయె కన
రాని యనురా-
-గాప్తి సమ్మో-
-దమ్ము గూర్చుచు

## ఇ కే ది

నిత్య సత్యాన్వేషణా-
తత్పరత మించి
ఉత్తమంబైనట్టి
చిత్తవృత్తి యికేది ?

విశ్వ కల్యాణ వాం-
-ఛాసక్తి మించిన
ఉత్తమంబైనట్టి
ఉచ్చ వాంఛ యికేది?

శాశ్వతానంద వా-
-ర్నిధి వీచికల నూచు
విశ్వ సామ్రాజ్య పా-
-లనకు సాటి యికేది ?—

---

## ఓ ర సా ల మా !

ఏ యేయే పరిస్థితులు
ఎపుడెపుడెటు లేర్పడినవి
నీలో నీ మార్పు నిటుల
నేటికి గొనివచ్చుటకై
ఓ రసాలమా ! వచింపు
వేడ్క యొదవినది వినగా.

మట్టిని దిని ఓ మావీ !
మధురమైన ఫలముల నీ
వెట్టు లొసంగెదవు తెల్పు
వేడ్క యొదవినది వినగా.

కిసలయములు ఓ చూతమ !
పసిదనమును దలపించుచు
ఉషోరేఖలుగ దోచును
ప్రసూనోదయము వేళను.

మిసమిసలారెడు పసగల
కిసలయముల మెసవి మెసవి
యశోగానమును సల్పుట
పికమిక పరభృతమాయెను.

---

# ప్రార్ధన

అర్ధింతును నే
ప్రార్ధింతును మిము
ఆనందమ్మున
నుండండి
ఆనందము మది
నింపండి మీ
రానందమ్మును
పంచండి ॥

అందరు ప్రజల
సుఖమ్మునకై మీ
-రభిలాషను మది
నింపండి
కొందరి సుఖమున
-కే ప్రపంచమను
కొంచపు భావము
చింపండి ॥

అర్థమ్మే స-
-ర్వార్థదమను నీ
యర్థవాదమును
విడువండి
అర్థమ్మందరి
సౌఖ్యమ్మనకను
సార్థక వాదము
నమ్మండి ॥

అర్థము మించిన
ఆనంద మీమ్మ
యవనిని ఎంతో
కలదండి
అర్థమ్మందరి
యక్కర దీర్చిన
సార్థక మౌనని
నమ్మండి ॥

# ప్ర బో ధ ము

చిత్తవృత్తులను రే-
-కెత్తించు కొనకోయ్
ఉత్తుత్త బాధలను
హెచ్చించు కొనకోయ్
చిత్తరువులనె గాంచ
చిత్తము భ్రమించుచో
-నత్యున్నత స్థాయి
-నందుకొన లేవోయ్ ॥

దర్శనీయముగాని
దేదోయ్ జగతి నా
దర్శమై రాణింప
దేదోయ్
స్పర్శనీయముగాని
దేది యీజగతి న-
-స్పర్శనీయమ్ముగ గన
రాదోయ్ ॥

ప్రేమ పాత్రము గాని
దేదోయ్ జగతి నీ
ప్రేమ గోరని ప్రాణి
లేదోయ్
ప్రేమింతు వాకదాని
ప్రేమింప వాకదాని
ప్రేమమయమౌ జగతి
ప్రీతి నరయగ లేక ॥

తరులు ఫలియించు నెం-
-దులకోయ్ జగతి నీ
విరుల పరిమళ
మెవరి కొరకోయ్
అరులనుచు పరులనుచు
సరివారలనె దలచి
నెటి సుఖమ్ములను నీ
వరయలేకున్నావు ॥

భువనమొక ప్రాసాద

మానోద్యానమున్న

ప్రాణులౌదురు బంధు

వరులోయ్

పంచభూతములు నీ

పరివారమున ముఖ్యు

లింటి దీపములౌను

ఇనుడు తారలు శశియు ॥



# వి శ్వా స ము

నా మనోహర గీత-
మాలపించే వారు
నా మధుర స్వప్నముల
నిజమొనర్చే వారు
నామంజులార్ద్ర హృద-
-యము గ్రహించేవారు
పుట్టియున్నా రింక
పుట్టగల రెందరో ॥

నా స్వేచ్ఛలో నిరా-
-పేక్ష జూచేవారు
నాయిచ్ఛలో నీశ్వ-
-రేచ్ఛ గనుగొనువారు
నా విశాలాశయ ప
-విత్రత నరయువారు
పుట్టియున్నా రింక
పుట్టగలరెందరో ॥



## ఓ పిపీలికా !

ఆదమరపేలేక
ఏదో తిరుగుదువిట్లు
మోదము న్గందువా ?
నీ వో పిపీలికా !—

అదనెరిగి పదనరసి
యెవో కూడబెట్టెదవు
పొదుపేమొ యెరుగుదువ?
నీ వో పిపీలికా !—

సడిసన్న నీదు నడ
వడి పెంచుచుండెదవు
సడిచేత నడలుదువ ?
నీ వో పిపీలికా !—

సరిపంక్తులోననే
సరసరా ప్రాకెదవు
సరి నెట్లెరుంగుదువు ?
నీ వో పిపీలికా !—

పరెగాని నిన్ననే
సరిగ నెరుగుదునట్లు
సరిగ నన్నెరుగుదువ ?
నీ వో పిపీలికా !—

నిను తొలి వచించి యా-
-పై నలువసెంచు నా
౽ెనరు మదినుంచుదువ ?
నీ వో పిపీలికా !—

అంటకను నిన్ను నే
నొంటరిగ కూర్చున్న
గంటు వెట్టుదు వేమి ?
నీ వో పిపీలికా !—

బంటుతనమౌన? నే
నుంటయే గిట్టదా ?
తుంటరివ ? కాకున్న
నీ వో పిపీలికా !—

తరులెక్కి చూచెదవు
గిరులపై దోచెదవు
విరులగని మురియుదువ ?
నీ వో పిపీలికా !—

దినకర తుహినకరుల
కనుగొనగ జాలుదువ?
తారకల నరయుదువ ?
నీ వో పిపీలికా !—

## హెచ్చరిక

ఢిల్లీలో
　　తిష్ఠవేసి
వల్లింపకు
　　డికనీతులు
పల్లెటి యను
　　భవమును గని
చల్లగ నా
　　లోచింపుడు—

I

కులము లంత
　　రింప వలెనా ?
మతములు
　　మాయగవలెనా?
మతిగల
　　మాటలివౌనా ?
అతి తెలువుల
　　నుడులాయివి?—

విపరీ తా
　　లాపమ్ముల
మతిలేని ప్ర
　　లాపమ్ముల
శృతి గలియని
　　మీమాటల
నతికింపకు
　　డజ్ఞానము—

రక్తపు శే
　　రులు పారెను
నిక్కము నే
　　గాదన నిది
మతమొక
　　కారణమౌనా?
మతిగల దు
　　శ్చింతనలా?—

భారత యు
ద్ధమునకు ఏ
దారి మతము
తీ సి న ది ?
గాథ ద్రవ్య
గా తేత్రతను
బాధకు ఏ
మతహేతువు ?—

కళింగ యు
ద్ధమున కేమి
కారణమో
మతమెన్నగ ?
అ ల గ్జాం డ
రా నా డే
మతమునకై
దా డి జే సె ?—

పదవి కొఱకు
　　భాగ్యమునకు
పరనారీ
　　సౌఖ్యమునకు
పాపపు టూ
　　హల కెన్నో
ఫలితములౌ
　　యుద్ధములు—

కులమున దో
　　షమ్ములేదు
తలలో గల
　　దా దోషము
మతము కాదు
　　బాధకు దు
ర్మతు లౌదురు
　　కారకులు—

—;o;—

# సహజీవనసిద్ధాంతం

సహజీవన
సిద్ధాంతం
సహజీవన
సిద్ధాంతం
పరివర్తన
మునసౌనదె
భయజీవన
రాద్ధాంతం ॥

సామ్య వాద
మునకు నిరుగు
సామ్యవాద
స ర శి కి ని
పొరుగున గల
ప్రజారాజ్య
పద్ధతి దే-
శములకును

రాచరికము
లకును నిరం
కుశ పాలక
దేశములకు
సఖ్యము గను
మన సేర్పిన
సహజీవన
సిద్ధాంతం ॥

పరివర్తన
మునవౌ నదె
భయజీవన
రాద్ధాంతం ॥

శ్వేత ముఖులు
ఆఫ్రికనులు
నీగ్రోలును
అమెరికనులు
చైనీయులు
జపానీలు
హైందవులును
ముస్లిములును

సఖ్యముగను
మన నేర్పిన
సహజీవన
సిద్ధాంతం
పరివర్తన
మునవౌనదె
భయజీవన
రాద్ధాంతం ॥

కులము తోటి
కులము తోడ
మతమ్ము
మతమ్ముతోడ
వర్గ మితర
వర్గముతో
నిహపర సమ
చింతనమున
సఖ్యముగను
మన నేర్పిన
సహజీవన
సిద్ధాంతం
పరివర్తన
మునవౌ నదె
భయజీవన
రాద్ధాంతం ॥

కుల వి-
ధ్వంసకవాదుల
మత ని-
ర్మూలనవాదుల
వర్గద్వే-
షకులను పర
మార్ధ విరో
ధకులలోన
భావావేశ
మ్ముడిగిన
సహజీవన
సిద్ధాంతం
పరివర్తన
మునవౌనదె
భయజీవన
రాద్ధాంతం ॥

అతికి పోని
గతి దప్పని
మితి నెరిగిన
మతులై నను
సకలావని
నిఖిలజనులు
సుఖశాంతుల
మనగలరిదె
సహజీవన
సిద్ధాంతం
అహమహ మిక
రాద్ధాంతం ॥



# న న్న య

ఆంధ్రి సరస్వతి
పున్నెము పంటవు
ఆంధ్రులదౌ చిర
తపఃఫలమ్మవు
ఆంధ్రి కవుల కె
ల్లర కారాధ్యుడ
వార్షమతీ ! సుకృతీ !
మ హా క వీ !—

దర్శించితివి శారద నిశలలో మహో
జ్జ్వల తారకాహార సంతతులను
వీక్షించితివి ఘన విపిన సీమలలోన
సాధు ఋష్యాశ్రమ సముదయములు
కనుగొనినావు నిష్కలుషాంబు సంపూర్ణ
కాసారములు సాంద్ర కాననముల
వినినావు శుకశారి వివిధ మంజులరుతి
కమనీయమౌ సామగానరవము.

వాక్కు_శాసించి యార్షసంపద్విశిష్ట
భారతేతి హాసమ్ముగను భవ్యదృష్టి
నాంధ్రమొనరించును కంటివమృతసిద్ధి
ఆదికవి! మానమస్కృతులందుకొనుము.

ఆంధ్రజాతి మను
నంతవరకు నీ
ఆంధ్రభాష నిలుచు
నంతవరకును
అజరామరమౌ
యశఃకాయమున
ఆదికవీ! మహి
మోన్నతి నుందువు—

జయము జయము
వాగను శాసన!
జయము జయము
కవితా విశారదా!
జయము జయము
ప్రథమాంధ్ర మహాకవి!
జ య మ వి ర ళ
జపహోమతత్పరా!—

రాజ రాజ
మకుటస్థిత ర
త్నామల కాంతి వి
రాజిత చరణా !
యజన యాజనా
దిక షట్కర్మా
చరణ ప్రాప్త ద
యాంతః కరణా !—

విదితాఖిల శా
స్త్ర పురాణ సము
చ్చయ నానార్థ
ప్రతి భా జ ల ధీ !
నిగమాగమ సా
రావగాహ నో
ద్దీ పి తా ర్థ రుచి
సూక్తి నిధీ !
జయ జయ జయ న
న్నయ మ హా క వీ !—

## తి క్క న

తెలుగు కవుల
　　నగ్రగణ్యుడవు ఓ
తిక్కయజ్వ !
　　కొను మా జోహారులు.

　　　　కాలకూట మగునా ?
　　　　　　యశోద చను
　　　　బాలగునా ? ప్రియము నీ
　　　　　　క టం చు ను
　　　　హరిహర నాధుని
　　　　　　ప్రశ్నించిన ఓ
　　　　పరమభక్త ! గై
　　　　　　కొను జోహారులు ॥

పరమమైన
　　అర్ష తేజమున క్షా
త్రము వెలయించిన
　　కళాభిజ్ఞుడా !
హరిహరునకు
　　భారత మంకితమిడి
చి ర త ర మౌ
　　యశముగన్న సుకవీ ! ॥

మన మలరించెడు
మంత్రాంగముగని
ర ణ ము న నీ
శౌర్యమ్మును కన్గొని
అ ను ప మ ము లు
కావ్యకన్యలన్గని
మనుమ సిద్ధి నిను
మామగ నెన్నెను ॥

అదను నెఱిగి పద
ములను గూర్చితివి
కదనమ్మున శ
త్రులను దున్మితివి
అ రి వీ రు ల
గుండెగాలమా ! నీ
సరియెవ్వరు ? కవి
తా శిల్పములో ॥

యజనమ్మున
యజ్వవైతి, ఘనుడవు
రాజనీతిని వి
రాజిత యశుడవు
గంటము పట్టిన
నేర్పున నరిపై
కత్తి నెత్త జా
లిన ధీరుండవు ॥

వె లు గొ స గి తి
తెలుగుకైత కెంతో
తె లు గు లు నీ
ఋణము దీర్పజాలరు
తెలిగించితి పలు
నుడుల పోడిమిని
భారతమున పదు
నైదు పర్వములు ॥

పద చిత్రములను
చిత్ర పదములను
పురాణమున నా
టకము వెలార్చిన
స జీ వ మౌ
పాత్రసృష్టి నీకిల
న జే య మౌ
ఘనతనిచ్చె సుకవీ ! ॥

కవి, యజ్వవు రాజ
నీతి విదుడవు
ఘన పండితుడవు
రణ ధీరుండవు
కలకాలము నిల్చు
కీర్తి చంద్రిక
ఇల నెవ్వరు నీ
సాటి? మహాకవీ! ॥

# ఎట్లా ప్రెగ్గడ

కవిత్రియము కవి
తా స్రవంతు లతి
పవిత్రములు స్వా
దు పూర్ణములు నౌ
గంగా య ము నా
సరస్వతులుగా
సంగమించె నాం
ధ్ర భారతమ్మున.

కవిత్రయము మూ
ర్తి త్రితయమ్మన
కవి బ్రహ్మ తి
క్కన యౌ నెన్నగ
నన్నయ విష్ణువు
శంభు దాసుడవు
సాంబ శివుడవే
ఎట్లా ప్రెగడా !

నన్నపార్యు
కవితా ప్రసన్నతయు
తిక్కయజ్వ
చెక్కడంపునగిషీ
చక్కగ నీలో
మేళవించినవి
చిక్కని కవితను
శంభు దాసుడా !—

అరణ్య పర్వము నం
దాగమనము
అంతుగంటి వెం
తేని నేర్పుతో
కవిత్రయము నం
దొక్కడవౌ నీ
పవిత్ర నామము
చిరవినుతమ్మగు.

కొంచెమెయౌగా
　　కేమి?, గుణముచే
నెంచబడును
　　ఘనముగా నెదేనియు
సంచిత పుణ్య
　　విశేష ర చ న ము న
నంచిత యశ
　　మందినావు సుకవీ!—

భ గీ ర థు డు
　　తెచ్చినాడు గంగను
అహో భాగ్య మనగా
　　మ హీ జ న ము
మహోదధుల
　　రెంటి నొకట గూర్చితి
వహో భాగ్యమని
　　మహాంధ్ర మనగా—

నిష్కామముగా
కృషి సల్పిన నీ
యుత్కృష్టాద
ర్శము స్తవనీయము
శాశ్వత మౌ
కీర్తిగాంచితివి నీ
కర్పింతుము గై
కొను జోహారులు.

## పో త న

వ ర హా ల కు
ఆ స జెం ది నినునే
ధ ర ణీ శు ల
కమ్మ్రబోను నమ్మ్రము
పరమార్ధము
నె రి గి యె జీవింతును
ధరను దున్ని నే
హా లి కుం డ నై—

కాటుక కంటను
అశ్రుల రాల్చకు
హాటక గర్భుని
రాణి యంచు నతి
సూ టి గ ని
న్నోదార్చిన ధన్యుడు
పో త న కి ల
సాటియెవరు భారతి!?

కామిగాని మోక్ష
 గామి యౌ నితడు
లేమి, లేమి నెరుగని
 మహోన్నతుడు
ఈశ్వరార్పణ
 మ్ముగ నొనరించెను
శాశ్వతుడీకవి
 సకల కర్మలను—

శృంగారమ్మున
 భక్తిని నించెను
భక్తిని శృంగా
 రమ్మున పెంచెను
మధుర భక్తి భా
 వన జీవించెను
మహితాత్మతనిల
 పోతన గాంచెను—

భా గ వ తా మృ త
సింధువు నాంధ్రుల
భా గ్య మ్మొ న రి ం
చిన క వి శే ఖ రు
డాత్మీయుడు ఆం
ధ్రుల కె ల్ల ర కిత
డారాధ్యుడు పరమ
భా గ వ తు ల కు—

ప లి కి ం చె ను
రాముడె తానై
పరమాద్భుతముగ
భాగవతమ్మును.
ప ల్కి నా డు భ య
వాక్రొ్ప్ఢిని కవి
పోతన భక్తుడు
భవహారమ్ముగా.

భక్తిరసము నాం
ద్రుల హృదినించిన
శక్తి శాలియౌ
సహజకవీ ! శ్రీ
రామచంద్రు కృతి
పతిగా జేసిన
భక్తవర్య ! కొను
మా జోహారులు—

చేతులారంగ
శివుని పూజించినావు
నోరునొవ్వంగ
హరికీర్తి నుడివినావు
దయయు సత్యంబు
లోనుగా దలచినావు
పరమభక్తాగ్రగణ్యా !
సత్కవివరేణ్యా!-

# తి రు ప తి వేం క టే శ్వ రు లు

కింక వీంద్ర
ఘటా ప ం చా న న
కీర్తి శోభితులు
శ తా వ ధా ను లు
ప్రాక్తన జన్మ వి
శేష లబ్ధ కవి
తా స్వరూప పుం
భావ సరస్వతు
లాంధ్రావని ది
గ్విజయముగా విహ
రించిరి తిరుపతి
వేంకటేశ్వరులు.

కవిత యొక్కని దందు ఘనత వేరొకనిది
కవితా స్వరూపమేకాకృతి గను
భావ మొక్కని దందు భాష వేరొకనిది
రూపంది యొకటిగా రూఢ మగును
వచన మొక్కనిదందు వరుస యింకొకనిది
వరణమ్ము నందేక వాక్యముగను
కవన మల్లుటలోన ఘనపాండితీగరిమ
యొకరొకరు ప్రసిద్ధులొక కవితను.

వాక్కు నర్థమ్ము సుమము సువాసనయును
చంద్ర చంద్రికలును గర్మ జయము లట్లు
మెలగి దేశమ్మునకు క్రొత్త వెలుగు గూర్చు
కవిత నిచ్చి యేకాత్మత గాంచినారు.

"దోసమటం చెరింగియును
దుండుడు కొప్పగ
పెంచినార మీ
మీసలు, రెండు బాసలను
మేమె కవీంద్రుల
మంచు దెల్పగా
రోసము గల్గెనేని
సుకవుల్ మముగెల్వుడు
గెల్చిరేని యీ
మీసలు దీసి మీ
పద సమీపమునన్
శిరముంతు"మన్న యా
వేశము పాండితీగరిమ
యద్భుతమౌ నవధాన విక్రమం
బాసకలమ్ము నెంచి మది
మించినభక్తి నుతింతు మెప్పుడున్.

నవ్య భావోపేత
　　దివ్య కవితావేశ
భవ్యాపగాఽవగా
　　హన దీప్త మతులార !
స్తవ్యధీ సముపేత
　　దివ్యవాక్సహిత సం
స్తవ్య తేజో విభా
　　సిత ముఖాంబుజులార !

నవ్య కవితాప్రవర్తక
　　దివ్యయశ స
మంచితాత్ములు నవ
　　కవికుల గురువులు
సుకవివరులార! మా
　　నమస్కృతుల గొనుడు
భవ్య యశులార ! మీ
　　రమృత పథముగనుడు.



# కవిసమ్రాట్టు

కొండంతటి
  వాడెయౌను దేవుడు
కూర్చగలమె
  కొండంతగ పత్రిని
నిండు ముదమ్ము
  నొసంగు చంద్రునకు
నూలుపోగునను
  భక్తి జూపుదుము
దండి సౌఖ్యము
  లొసంగు దేవతల
దండమునను
  పరితృప్తుల జేతుము
మెండౌ గుణ
  గణ్యత గలవారికి
దండవైచి
  సత్కృతి భావింతుము
ఉండవలయు భక్తి
  కుదురుగా హృది
నిండునంత శక్తి
  తనకు దానది.

విశ్వనాథ
వంశ తిలకు కవితా
విశ్వనాథు
సమ్మాన మొనర్చెదు
ఘనవిశేష
మెటులగల్గు ప్రాశస్త్యస
జనివిశేష
కలనగాక నూరక.

ఉన్నవార
రెందరేని కలరీ
యున్నతిగనుగొన
జాలుదు రెందరు ?
మన్నుభాగ్యమని
భావించెదు వా
రున్నత భావుకు
నెటుల గణింతురు ?

గతము ననాగత
మ్ములను దలప కా
గతమొకచే గతి
యని దలచిన ని క
" దిక్కాలాద్యన
వచ్ఛిన్న" మ్మ ను
తె లి య జా లు
తెలివికల్గునెటులను?–

క ను లు గాంచసేరని
దృ శ్య ము గ న
వీ ను లు వినజాలని
శ బ్ద ము వి న
మానస మూహింపని
మహిమను గ న
మా న వ జా తి కి
మార్గదర్శి క వి.

ఋషిద్రైగతమె
ల్లను దర్శింపుము
ఋతమతిస్థైధ
ర్మము ప్రవచింపుము
వితతమ్ముగ నరయు
ననాగరము ను
అతిలోకము శి
ల్పము విరచింపుము.

ఆర్షసంతతిని
ఘనులం దొక్కఁడు
ఆర్షధర్మ వి
జ్ఞాత యౌనితఁడు
ఆర్య ఋషుల ప్రతి
నిధి కవిస్థై యిత
డవతరించె నాం
ధ్రుల సుకృతమ్మున.

గత వైభవ మర
యగ మదినెంచిన
మతివిభవము దెలి
యగా దలంచిన
మతిమంతులుగా
మననెంచిననీ
స్తుతమతియౌ కవి
కృతులు శరణ్యము.

సాటిలేని మేటి
నేటి కవుల నితడతి
పాటవమున రచ
నమున వాక్కునను
ఘాటి కల్గు వారి
పాటి యితడే
నాటి వారికైన
సాటి యనుగొన.

ఎంతదాక నాంధ్ర
జాతియిలమను
నెంతదాక నాంధ్ర
భాష నుతిగను
నంతదాక నిల్చు
కృతుల సీకవి
సమ్మాన మ్మాంధ్రికి
ఉపహారము.

## విశ్వకవి

తనుమనోభరి
తాన్వృత సింధూ!
మనోమోహ భా
వుక జనబంధూ!
జనగణ మనోధి
నాయక కవి! ఓ
ముని జన తుల్య వి
శేష చరిత రవి!
స్వాదు వచో
రచనా! రసాకృతి
మోద వార్ధి
కలనా! రవీంద్రా!

బాలసూర్య కిరణ

జాల దీప్తము

నీలనభో తార

కాళి సుభగము

నీల సింధు జల

ధౌత నిర్మలము

నీ మృదు మంజుల

కవితాలాపము

సాధు జీవన

చణా! రవీంద్రా!

స్వాదు గేయ

రచనా! కవీంద్రా!—

ఆమని కోకిల
    రావము, శారద
యామిని, నచ్యుతు
    వేణునినాదము
భారతీ చరణ
    నూపురనాదము
నీ మృదు మంజుల
    కవితాగానము
వేదవిదాశీ
    ర్వచనజీవనా!
స్వాదుగీతి
    రచనా! రవీంద్రా!

ప్రథమ ప్రభాత
దర్శనోజ్జ్వల మతి!
ప్రథమ సామరవ
శ్రవణోన్నత శ్రుతి!
ప్రథమ దశదిశా
క్రాంతవిలోకన!
ప్రథమోన్నత భావ
ప్రతిస్పందన!
వేదవాద
ధిషణా! మహాకవి
మోదవాద
కలనా! రవీంద్రా!

జ్ఞాన భాస్కరా!
మౌని సుధాకర!
ధ్యానామృత మధు
పాన మత్తకవి!
గేయాంజలి
గొనుమా! మోదమ్మున
గీతాంజలి
దాతా! విశ్వకవి.

## మహాత్ముడు

సత్యాహింసలు
శస్త్రాస్త్రమ్ములు
శమదమములె
కవచమ్మును దాలుచు
శ్రమసహన
మ్మను మహాశక్తి
శాంతసమరమే
రణదుందుభి ఓ
క్రాంతదర్శీ! నీ
రణరంగమ్మున
చిత్రమైన నీ
నిర్వచనమ్ములు
సత్యాన్వేషీ!
గాంధి మహాత్మా!

ఉప్పు కల్లు ఘన
    విజయ సాధనము
తప్పు నొప్పుకొను
    టయు రణనీతి
ఒప్పానరించుట
    శత్రార్జనము
ముప్పుతిప్పలై
    తోచెను, చల్లగ
తప్పుకొనిరి, పా
    లకులు తమంతట
ఎక్కడి ధర్మము
    నేర్చితివయ్యా !
కరుణాసాంద్రా !
    గాంధి మహాత్మా !—

ఘనమైనది నీ
స్వదేశ దీక్ష
ధనము నీకు
బ్రహ్మచర్య రక్ష
శాంతి తేజమున
క్రాంతి దర్శనము
ఆర్ష ధర్మ యు
క్తము చిరసత్యము
నిజ జీవనమున
నిరూపించితివి
దేశ దాస్య తమ
నిర్మూలక ! స్వా
తంత్ర్య ప్రదాతా !
గాంధి మహాత్మా !

రాట్న చక్రముల
ధర్మ చక్రమై
రాణవహించుట
కననయ్యెడి నీ
తను మనములు బలి
యైనవి ప్రజకై
అనువౌనా? దేశ
శాంతి రక్షణ?
వినయాంజలిగై
కొనుము మహాత్మా!
అనవరతము శాంతి
పథము జూపుము
విశ్వశాంతి కాం
క్షిత చరితా! ఓ
సత్యాన్వేషీ!
గాంధి మహాత్మా!



# అరవిందుడు

అణువులోని
బ్రహ్మాండ విశేషము
అణు రహస్యమీ
బ్రహ్మాండమ్మున
అవనిని పరమా
త్మావరోహణము
అవని ప్రాణి
యారోహణక్రమము
దివ్య చక్షువుల
దరిసితివి ప్రభూ!
భవ్యాత్మా!
అరవింద!
జోహారులు.

త మ ము న డ మ
నయు మరయనివారికి
రా జ స ము న
లోలుపు లగు వారికి
సా త్త్వి క ము న
నా ర్ద్రి త గనువారికి
త్రి గు ణా తీ త
స్థి తి ని రూ ఢ ను
ప్రపంచ మనియెడి
ప ద్మ వ్యూ హ ము
ఛే ది ం ప గ జా లు
శ క్తి నొ స గ గ
చి త్త వృ త్తు ల
ని రో ధ మ్మొనరిచి
యో గ స మా ధి
సమా రోహిత మతి
యో గ ము సల్పిన
ఘ న యో గీం ద్రా !
గై కొ ను మా !
అ ర వి ం ద !
జో హా రు లు.

వి శ్వ శాం తి
విచ్ఛేదక శక్తుల
సృ ష్టి కా ర్య
నిర్మూలన రక్తుల
శా శ్వ త మా
నాసురిక ప్రవృత్తుల
శ క్క ది ద్ద
జాలెదు యోగీంద్రా!
ఘ న ఘ నా ఘ
ని ర్ఘా ల నా ని లా !
గై కొ ను మా !
అ ర విం ద !
జో హా రు లు.



# జగదీశచంద్రుడు

చరాచరమ్మౌ
　　విశాల విశ్వము
ఆత్మస్ఫురిత
　　మన్యమొకటి లేదను
ఆర్య ఋషుల
　　సంతతిని మెఱయించు
ఆర్ష బుద్ధి!
　　జగదీశ చంద్రవసు.

నీ నయనమ్ముల
　　నే విచిత్ర మో
నీ మనమున గల
　　దే యద్భుత మో
నీ కృత కర్మ
　　విశేష మెట్టిదో
కను గొంటివి
　　శిలలను ప్రాణమ్మును.

వృక్షమ్ముల సుఖ
దుఃఖము లరసితి
పక్షి జన్మగు
సానుతాపమున
అక్షయ కీర్తి
విశాల! జ్ఞాన ఖని!
వృక్ష శాస్త్ర
విజ్ఞాన భాస్కరా!

క్షణ పరివర్తన
శీలము జగతిని
మనజాలుదు రె
వ్వరు? చిరకాలము
చిరతర కీర్తి
వశీకృత జీవన
మును గడపిన
జగదీశ! ధన్యుడవు—

# మఙ్గళము

ఇల లో న

ఖ్యాతికి తార్కాణము

కల కాలము

విశ్వము వినుతించును

పలుపుర పాత్రు

జ్ఞుల కూటమి నీ

పలుకున కెప్పుడు

ప్రణతి శతమ్ములు.